# మా చిన్న కథ

## కథలో పేర్లు కల్పితమైనా; సంగతులు మాత్రం కొన్ని సత్యమే

# రెండు శవాలు

౧

ఓరీ! యంకొ. కచ్చడం కట్టు పట్నంపోవాలె చెప్పివుంది.”

“మన యెడ్లు మోటకు పోయినయ్ దొరా?”

“యెల్లపోనీకి చెప్పు, పొలంపొయ్యి యేడనన్నా రెండెడ్ల పట్టుకరమ్మని.”

యల్లపోడు పొలంపొయ్యి మోటమీదవున్న రాజిరెడ్డి యెడ్లను యిప్పిండు.

శ్రావణమాసం వచ్చిచ్చింది. యెక్కడా యిన్ని నీళ్లు లేవు. బావు లెండిపోతున్నయి జర జర పూరబెట్టి మోటలుకొడుతున్నరు వరిపొలాలకు.

“అరే, యిప్పుడరా. పొలం యెండిపోతున్నది పొలంపారలేదు. మళ్లతాపకిస్తా వాయెడ్లు, అన్నడు” రాజిరెడ్డి.

“పొలం యెండిపోతే యేమంటవు. అ౦ ఇంకా మళ్లపోతా యేమవరిగేది, పొద్దుందాక. జలిపోకుంటే దొరకొడ్డాడు. పట్నంపోవాలంట. లేవు చేసి. మోటరేలయింది.”

అంటూ మోటమీదియెడ్లను యిప్పిపట్టుకపోయి దొరకచ్చడానికి కట్టిండు.

మంగలెంకడు కచ్చడంలో గడ్డిపెట్టి పరుపేసి ట్రంకుపెట్టె దుప్పటిలో చుట్టి పెపుకకట్టుకొని కందిలి చేతబట్టుకొని యెడ్లముందర నిలబడ్డడు.

వేంకటరావు లాగు, షేర్వానితో దుకొ్కని, పున్నవున్న రూముటోపి పెట్టుకొని బూట్లు తొడిగి, అద్దముముందు నిలచి సరిచేసుకొని మీసాలు మెలికలుగాద్రిప్పి, చేత కర్రబట్టుకొని వచ్చి కచ్చడంలో కూర్చొని, బూట్లు మంగలోని చేతికిచ్చిండు. అరే! రామా! నేనొచ్చిందాక యింట్లోనే పండు అని చెప్పి కచ్చడం వారిబట్టించిండు. మంగలెంకడు దీపునపెట్టె, ఒకచేత కండిలి, ఒకచేత బూట్లుపట్టుకొని కచ్చడం ముందు వురుకుతున్నడు. దడాదడ ౨ గంటల్లో ౧౨ మైళ్లదూరానవున్న నల్లగొండచేరిండు. కచ్చడం యెనక్కిపంపి సర్కారిబస్సులో పట్నంపోయిండు. ఆయన పట్నంపోయి వచ్చేదాకే జాగీర్దారు చచ్చిన గైరుమామూలీ తాతీలువచ్చి పేషీకోర్క పట్నంలోనే యున్నడు యేడురోజులదాకా వేంకటరావు.

౨

మృగశిరలో చారెడువానపడ్డది. పునాసపైర్లు మాత్రం యేసిర్రు. చెరువుల్లోకి బావుల్లోకి నీళ్లురాలేదు. ఆరుద్ర యేమిలేదు చిన్నపుశాల పూర్తికానే పోయింది. పెద్దపుశాల రెండుపాదాలు పోయి మూడోపాదం జొరింది. రాత్రిల్లు గొండ్రికప్పలు వర్లటం పగలు తూనీగలాట్టంతప్ప యెక్కడా మబ్బువూసు లేదు. పసులకు నీళ్లు లేవు. గడ్డి లేదు. కాపుదనంఅంతా లొల్లిపెడుతున్నరు. మోటకు కుండెడువంతున యేడుకుని పోచమ్మకు వరదపాశం పోయించిర్రు. బాపనాయనతో విరాటపర్వం చదివించి శివునికి వెయ్యిబిందెలతో ఏకాదశరుద్రంచేయించి బ్రాహ్మణ సమారాధన పెట్టిర్రు. రూపాయిరూపాయి సంభావనఅని తెలిసి చుట్టుపట్ల బ్రాహ్మలుగూడ వచ్చిర్రు. అభిషేకంఅయింది. బ్రాహ్మలు స్నానంచేసి వచ్చి కూర్చున్నరు. యిస్తరేశేసి వడ్డించిర్రు. బ్రాహ్మలు తింటున్నరు. ఇంతలో కార్తెమూలజు రంతె మొగులయి అట్లెపైకిలేచి ఫెళ ఫెళ వురిమి తళతళ మెరిసి కురుసుకుంది వాన. పాపము బ్రాహ్మలు సగంతిన్నరు. ఇంకా చల్లపోసుకోలే. అట్లాగే తడుస్తు గబగబా తిని కొల్లాయిగుడ్డలు నెత్తినేసుకొని చెంబులు చేతబట్టి ఎక్కడివాళ్లక్కడ లొల్లిపెడుతూ పరిగెత్తిర్రు. ఆకొట్టిన కొట్టటం మూడురోజులు ఒకటేవాన. భూమంతా నీటిమయం— చెరువులు కుంటలు నిండినై. కొన్ని చెరువులు గండిపడ్డయి. కొన్ని తెగినై— పాతగోడలన్నీ పడిపోయినయి—సూర్యనమస్కారాలు చేసేవాండ్లు మూడురోజులనుంచి వక్కపొద్దులే. పట్నం కొట్టుకపోయిన ఫసలీ యాదికొచ్చింది జనానికి—మళ్ల భారతంలోని భీష్మపర్వం చదివించాలె అనుకున్నరు కాపుదనం.

౩

రాముడు ౧౨యేండ్ల ముతరాచుపిల్లడు. చిన్నప్పుడే అయ్యచచ్చినా కూలినాలిచేసి సాదిందియెంకి. యిప్పుడు వెంకటరావుతాన జీతానికుంచింది. అడ్డెడు గట్టిగింజలు అడ్డెడు పొట్టుగింజలుకలిసి నెలకు కుంచెడిస్తాడు. ఆదీ కూలీచ్చేఅప్పటో. అంటముట్టొచ్చేపొరడుకదాఅని.

వానైనా వరదైనా రాముడుచేసే పని తప్పదు. ఆవానలోనే తెల్లారుజామున చుక్కపొడవంగనే లేచివచ్చి పసులకాడ పెండదీసి బాగుచేసి ఇల్లువాకిలివూకి సానిపి చల్లి పాడిగొడ్లకుకుడితినీళ్లుచూసి తాపి పగ్గిగింజలు రుబ్బి వూరుంబడిబావిలో మంచినీళ్లుతెచ్చి ఇంకా చిల్లరపనులుంటెచేసి యింటికిపోయిండు. అంబలితాగొచ్చి పసుల తోలుక బంజరుపోయి రెండుజాములదాక మేపి చెర్లో బర్లపడ్గొట్టిగడ్డికోసుకొని బర్లతోలుకసంజెజామున ఇంటికివచ్చిండు. రాంగానె బర్లకు కుడితిపోసి పంచె కసువూకి కండిర్లలో చమురుపోసి ముట్టించిండు—పక్కలు అవ్వివేసి చిల్లరపనులన్ని చేసేవరకు రాత్రిజాముపొద్దయ్యింది.

“దొరసానీ యింటికిపొయ్యేదా! యీడ్నే పండేదా! అని అడిగిండు.”

“యీడెందుకుతిండిదండుగ. బువ్వవరు వండిర్రు. యింటికి పోదుగానిలే—చిన్నదొరకు సర్ది చేసినట్టుంది. యెంకటశెట్టి యింటికిపోయి నేను చెప్పినానని చెప్పి ఒక పైసాసొంటి తీసుకరా! అన్నది, వెలవనీటుతో — రత్నమ్మదొరసాని.

౪

రత్నమ్మదొరసానికిపోయినవాండ్లుపోగా ఒక్కదియావక్కపిల్లడే. ౧౨ యేండ్లకొడుకు—కలిగినసంసారం. అతిగారాబంగా పెంచుతుంది. ఈ వానముసురు పట్టినాళ్లనుంచి సర్ది కొడుతుందని మంచం దిగనియ్యటంలే — చలితోపి పులజా కుడుతా పైజామాతొడిగి దుశాలుకప్పి పండబెట్టింది—కాని. ఎందుకో ఏమో రెండు తుమ్ములుతుమ్మిండు—సర్దిచేసిందని సొంటితెమ్మంది. వూరికెతెమ్మంటే. చీకట్లో యెయ్యాలేపోవాలని. పైపెచ్చు.

చీకట్లో వంటింట్లోకి పోయి మంచినీళ్లబింద దేవులాడుతున్నడు. చేతికి చిటుక్కుమంది. కవ్వనకేకపెట్టి అమ్మో! సస్తి నేసస్తి అనియేడుస్తూ యింట్లోకి వచ్చిండు.

గాడిదీ లొల్లిపెట్టకు చిన్నదొర దడుసుకుంటడు—యేడ యింత చీమకుట్టిందో లేదో పెద్ద లొల్లిపెడ్తావు. ముయ్యినోరు—ముయ్య లొల్లిపెట్టకు—మూసనాలేదా? అంటూ— పనిపాటలలో కర్రతో కొడ్తే తగలరానిచోట తగిలి చస్తడేమోనని కమ్మరిసత్తయ్యతో చేపించిన రెండుచిన్నపట్కాలు చెవులకుపెట్టి కిర్రుమనిపించింది. గుడ్లనీళ్లు గుడ్లకుక్కుకొని యేడుపు దిగమింగి వూరుకున్నడు.

లే! మంచినీళ్లు—

లేవు యింట్లో—

బావికిపోయి చెంబుతో తీసుకరా.

తెస్తా.

అని చెంబుతోతెస్తే చాలుతదో చాలదోనని బిందెబట్టుక బావికిపోయి నీళ్లుముంచి బిందెనెత్తినబెట్టుక యింటికివచ్చిండు.

౫

రత్నమ్మదొరసాని చూచింది—

భడవా. యింత కావరమా! చెవులు వినరావూ. చెంబుతో తెమ్మంటే బిందెతో తెచ్చినావు లేపు లేకుండా తప్పించుకుందామని. పొద్దుటికి పాచినీళ్లుకావు—యేంచేసుకోను. చెప్పేదొకటి. చేసేదొకటి నీరోగం యిట్లాగానికుదరదు అని బిందెలోనీళ్లు మోరీలో కుమ్మరించి చెంపమీద పక్కటిలంటించింది. పో—చచ్చినట్టు బాయికిబోయి చెంబుతోతే—అన్నది దొరసాని—

యేడుస్తూ బావికిమళ్లపోయినాడు ఆ చీకట్లో వంటరిగా బావిలోదిగేసరికి కష్టాలన్ని ఒక్కసారి తలపుకొచ్చినయ్యి—మా— ఏమిబతుకు నాజానెడుపొట్టకయిన్ని తిప్పలా యెవర్నిభికెట్ల — యేదునియా కోసం—బతికితే ఎడికేడు మెతుకులు—చస్తేమూరెడునేల—

మాఅయ్య, యీ కష్టాలన్ని తప్పించుకపోయి ఆరాంగా వున్నడు—ఆకాశాన— యెట్టిగొట్టంలేకుండా—నేను మా అయ్యతావుకే పోతా అదేమంచిది అని తయారయిండు—

యింతలో యింటివద్ద తల్లియాదికొచ్చింది నేను యిందులోపడిచస్తే మాఅమ్మకు యెవరు చెబుగరు నాకోసం కనిపెట్టుక కూచుంటుంది నిద్రపోకుండా. నా తకిలీపు తప్పించుకుంటె మా అమ్మ తకిలీపెట్టా. కష్టంలోపడెయ్యాలి. మాఅయ్య చచ్చినా నన్ను కష్టపడిసాదింది. అని అనుకుంటుండగానే రత్నమ్మదొరసాని బంగలామీదినుంచి కూతేసింది. జల్లుమనవులిక్కిపడిలేచి చెంబుతోనీళ్లుముంచుకొని గుబులుపడుకుంట పోయిండు— పాపము చావటానికిమాత్రం స్వతంత్రంయెక్కడ—

“చిన్నదొర అప్పటినుంచి నీళ్లు—నీళ్లుఅంటుండు యేంచేస్తున్నవు యింతసేపు బావిలో.

అనిగుద్దులిమిచూచి గద్దించింది.

చెంబు అక్కడపెట్టిండు.

యేడుపురాలే. నిరాగుండె పడ్డది.

తనసొంతయింటికి ఆచీకట్లోనే ఒక్కవురుకవురికిండు. తోవలో కాలికింద గాజ్రుపనయేందో పాకినట్టయింది. వాడు బాగాచూచ్చాడే.

రాత్రి జామున్నర పొద్దయ్యాంది. గబ్బురయ్యిం చీకటి. జోరునవాన— కింద నేల గుంట పెట్టలుకొడారాదు. యెప్పుడో వకసారి తళక్కున మెరిసినప్పుడు జర దారి కనపడుతుంది. లేకపోతేలేదు. బజారున పట్టపురుగులేదు. ౧౦ యేండ్లపిల్లడు రాముడు పోవటానికిబయం పోకపోతే దొరసాని కొడుతుంది. ఆచీకట్లో [illegible] శెట్టియింటికిపోయి తలుపుతట్టిండు— పలకలే. యెంకట శెట్టి! యెంకటశెట్టి—

యెవరది!

నేను దొరోరిమనిసిని

యెందుకు

సొంటికావాలె

యెంతది

పైసది

లేదు

రత్నమ్మదొరసాని తోలింది

లేదనిచెప్పు. పైసకేమొస్తది—

అని చలిలో లేవలేక జవాబుచెప్పిండు. దగ్గుతూ మరియెన్ని తాపలడిగినా లేదంటే లేదన్నడు.

యింటికొచ్చి చెప్పిండు. “సొంటిలేదన్నడు. యెంకటశెట్టి.”

నాపేరుచెప్పలే! అందిరత్నమ్మ దొరసాని

చెప్పా. చెప్పినా లేదన్నడు.

నీవు పోయినవో లేదో యేగోడచాటునో నిలబడొచ్చినట్లుంది. అని చెంపమీద ఛటాలున కొట్టింది—మూలుగకుండా గోడకునిలబడ్డడు.

ఇంతలో చిన్నదొరలేచి మంచినీళ్లే! అని లేవబోయిండు—లేవకు సర్దికొట్టుతుంది. తెస్తాడులే—మంచినీళ్లు తే—పో అప్పటికి యేడుస్తువుగని అని తన దొరసానితనం చూపింది.

యింటికిపోంగనే కొడుకో యిప్పుడొచ్చినవేం—దొరవచ్చిండా అంది యెంకి. రాలేదు—పాదుగలవస్తాట్ట—నా చేతికి తేలుకుట్టింది. చలిచలిగావుంది. అని యేడ్చిండు. వెంటనే యెంకి బిడ్డను కౌగిలించుకొని—తానూ యేడ్చింది. మళ్లీ పరుగోని యింటిముందరవున్న—కుప్పాకు—నల్లవుప్పూ తాకనలిపి చేతికిరుద్ది కట్టుకట్టి బువ్వతిని పండుకోఅంది. “బువ్వొద్దు యేమొద్దు పెయ్యి చలిచలిగావుంది; అని గొంగడిలోంత కప్పుకుని పండుకున్నడు.

౭

తెల్లారి ఆబబేళకు పెద్దొరవచ్చి... ట్లంనుంచి.

పసులుయింట్లో నేవున్నయి. లో... పెండ్లాన్ని అడిగిండు పసులకాడి... అని.

“రాలే, రాత్రియాడనె పండుకోమ్మ... టికిపోతానన్నడు. కందిలీఆయినపట్టుకపో... టెవస్తలే దొరసానీ అని యెంతచెప్పినా వినకుండాపోయిండు, అనిచెప్పింది రత్నమ్మ దొరసాని.

అరే. యన్లా రాముడుయింటి దగ్గరవున్నడే మోచూచిరాఅని యల్లపోడ్ని తోలిండు. యల్లడుపోయి తలుపుతట్టిండు. పిలిచిండు యెంతపిలిచినా జవాబురాలే. యింటికప్పుమీది తాటాకుతీసి చూసిండు. కింద రామునిశవం దూలానికాడుకు యాలాడుతూ యెంకిశవం.

పట్వారికూడా వూర్లో లేదు జమాబందికినల్లగొండపోయి వారమురోజులయింది.

రాత్రిదాక యెవరికి తెలియకుండా కట్టుదిట్టము చేసి పన్నెండుగంటలరాత్రికి బేగారోళ్లని యెంటబెట్టకపోయి వూరెంబడున్న పాడుబొందలో రెండుశవాలను యేయించి పున్నుకప్పించిండు. వెంకటరావు.

మర్నాడే—గొల్లవాండ్ల మందలోనుండిపట్టి తెప్పించి రెండుయేటలు—వూర్లో కోమట్లవద్ద పనూలుచేసి ఒకదబ్బా నెయ్యి నల్లగొండపంపిండు.

పోలీసులకుకూడా పత్తాదొరకలే.

---

కథకుడు

ఉన్నవ వేంకట రామయ్య

# గోలకొండ పత్రిక

ధాతు నామ సంగి అధిక భాద్రపద శుగి ౧౮

సోమవారము


## వార్తా ప్రచారము

వార్తా ప్రచారము (Journalism) ఆధునిక కాలములో నాల్గవ సంస్థ (Fourth Estate) అని విఖ్యాతిగాంచినది. ప్రాచీనులును వార్త యొక్క ప్రాముఖ్యమును బాగుగా గమనించియుండిరి.

వార్త యందు జగము వర్తిల్లుచున్నది
అదియు లేనినాడ అఖిలజనులు
అంధకారమగ్నులగుదురుగావున
వార్త నిర్వహింపవలయు పతికి.

అని భారతమందు స్తుతింపబడినది. చారిత్రిక యుగమందును మన భారత దేశములో ఢిల్లీ సుల్తానులు "అఖ్బార్" (వార్తలు) వివిధభాగములనుండి యెప్పటెప్పటి సంగతులు అప్పుడప్పుడే వ్రాసి పంపు ఏర్పాటుగావించియుండిరి. ముద్రా యంత్రములు, రైళ్లు, తంతి, టపాలు వృద్ధిపొందిన తర్వాత నేటి పరిస్థితులేర్పడినవి.

నేటికాలపు వార్తాపత్రికల విధులు చాల క్లిష్టసమస్యలతో కూడినవై యున్నవి. పాశ్చాత్య దేశములో పత్రికలకు చాలవరకు స్వాతంత్ర్యము కలదు. కాని ప్రతి దేశమందును ఆయా ప్రభుత్వములవారు తమ రాజ్యాంగపద్ధతులకు విరుద్ధముగా నష్టము గలిగించు వ్రాతలు వ్రాయకుండునటుల చూచుకొనుచున్నారు. మరియు విశేషముగా పత్రికలు కొందరు కోటీశ్వరుల చేతులలో నిలిచిపోవుటచేత ఆ కోటీశ్వరులెట్లు ఆడించిన అట్లు పత్రికలు ఆడుచుండును. ప్రజలును వారివలలలో పడి వారుపెట్టినదే భిక్షగా, ఆ విస్సన్నలు చెప్పినదే వేదముగాభావించి స్వీకారము చేయుచున్నారు.

అమెరికాలోని సుప్రసిద్ధ గ్రంథకర్తయైన అప్టన్‌సింక్లేర్ అనునతడు సుమారు ౨౦ సంవత్సరముల క్రిందట "బ్రాస్‌చెక్" (The Brass check) అను ఉత్కృష్టగ్రంథములో పత్రికలు తన వెంటబడి యెట్లు బీభత్సముచేసి అన్యాయముచేసెనో యెట్లు అసత్యప్రచారము చేసెనో వ్రాసియున్నారు. ఆ గ్రంథము ఒక నవలవలె చదువదగినదై యున్నది.

ఇంగ్లాండు దేశములో ప్రతిరాజకీయ పార్టీకిని కొన్ని పత్రికలుకలవు. అందు ముఖ్యమైన పత్రికలు కోటీశ్వరులచే నడిపింపబడుచున్నవి. విశేషముగా వారికి నచ్చినవి వేయుదురు నచ్చనివి బుట్ట దాఖల్ చేయుదురు. ఒక్క "డెయిలీమెయిల్" అను పత్రికకు ౨౦ లక్షల పైగా చందాదారులని విందుము. ఆ దేశమున విద్యావ్యాప్తి హెచ్చగుటచేత ఇతర సర్వ సౌకర్యములు కలుగుటచేతను అట్టి మహత్త్వము పత్రికలకు కలిగినది.

ఇటలీ జర్మనీలలో, మొన్నటి బొంబాయి పత్రికాధిపతులవిందులో జవహర్లాలుగారు సెలవిచ్చినటుల, ప్రభుత్వమువారేది ఇష్టపడుదురో ఆవిధమగు వార్తలనే యిచ్చుటచే అచ్చటి పత్రికలకు స్వాతంత్ర్యము నశించినదని చెప్పవచ్చును.

ఇకమన భారత దేశము. బ్రిటిషిండియాలోకల స్వాతంత్ర్యము సాధారణము. దేశీయ రాజ్యములలో లేదనవచ్చును. బ్రిటిషిండియాలో ఎవరైననరే అడిగిన వెంటనే ఏమియు అలస్యములేకుండ పత్రికకు సెలవు దొరకును. కాని సాధారణముగా దేశీయ సంస్థానములలో కాబోవు పత్రికాధిపతియొక్క పరీక్ష అశ్వశాస్త్రములో గుఱ్ఱము పరీక్షకన్న కఠినముగానుండును. గుఱ్ఱానికి పండ్లున్నవా, సుళ్లు అన్నియు సుముఖముగా నున్నవా, జానుజంఘములు సరిగా కుదిరినవా, వివపాది కాదుకదా అని సర్వాంగ పరీక్ష చేసినట్లు ప్రభుత్వమువారు అభ్యర్థియగు పత్రికాధిపతి డబ్బు కలవాడా, బుద్ధిమంతుడా, చదువుకున్నాడా, మంచి నడనడిక కలవాడా, వాని భావము లపసవ్యములు కావుకదా, మనిషి తంటాలు పెట్టడుకదా, వ్రాసినపైన కలము జోరుగా ఝాడించదుకదా, పైత్యము వ్యక్తమగునంత లేదుకదా అని నానావిధముల (అనగా సి. ఐ. డీ పోలీసుపనియే యిందు విశేషము) విచారణ చేసుకొని సంపాదకుని గ్రహాలన్నియు సుముఖముగానుండిన సెలవిత్తురు.

బ్రిటిషిండియాలో నైననేమి, దేశీయ రాజ్యములందేమి పత్రికాధిపతుల దంతగా మెత్తనిమార్గము కాదు. పైనచెప్పినట్లు బ్రిటిషిండియాకన్న దేశీయరాజ్యములలో పత్రికలపై యెక్కువబరువు మోపుచున్నారు. ప్రభుత్వమువారికి నచ్చకుండిన [కారణము బుద్ధిపుట్టినపుడో ఒకటి చూపుదురు లేకుండిన ఎందుకనువారెవరు] పత్రికను ఏకదమ్మున ఆపివేయవలసినదిగ ఆజ్ఞయిచ్చిన ఆశ్చర్యము లేదు. పత్రికలను న్యాయశాస్త్రములో నిరికించి శిక్షించుటకు అర్హమైనవార్తలుగాని భావముగాని ప్రకటింపబడిన ఉత్తమపక్షము న్యాయపక్షమును ఏమన, ఆ పత్రికాధిపతిని న్యాయస్థానములో నిలబెట్టి విచారించి దోషియైన శిక్షించవలెను.

పత్రికలు తమ విధులను న్యాయముగా సరిగా నిష్పక్షపాతముగా నెరవేర్చినచో దేశముకూడ త్వరలో ఉన్నతికివచ్చును. దేశమునకు అభ్యుదయముకాని, విశ్రాంతికాని, వినాశముకాని, అపాదించుటకు పత్రికలు ముఖ్యస్థానము వహించునట్టివి. పత్రికలకును ప్రజలకును పరస్పర విశ్వాసము పరస్పర సానుభూతియుండుట చాల అవసరమని జవహర్లాలుగారికి పత్రికాసంపాదకులిచ్చిన మొన్నటి బొంబాయివిందులో బొంబాయిక్రానికల్ సంపాదకులైన బ్రెల్వీగారు చెప్పిన వాక్యములెంతయు సత్యయుక్తములు.

పక్షపాతము, కుత్సితములేని ఉత్తమ పత్రికల వ్యాప్తి సత్యమునుపోషించుచు, దేశపరిపాలనను, స్థితిగతులను కుట్ర, అసత్యములచే కృళ్లనీయక కాపాడును అట్లుగాక మతావేశపు ముచ్చట్లచేతనో, లేక పక్షపాతము అబద్ధము స్తోత్రము అను గుణత్రయముచేతనో అధికారి వర్గమును మాత్రము మెప్పించి లాభముపొందు పత్రికలు దేశమునకు లాభకారులుగాక నష్టదాయకములే యగును.

## అఖిలాంధ్రకథకుల సమ్మేళనం

(స్వ. వి.)

హైదరాబాదు దక్కన్ ౨౭-౬-౪౫ ఫ

నిన్నను మొన్నను సాయంకాలము ఈసగర మండలిసుల్తాను బజారులోనుండు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయములో అఖిలాంధ్రకథకుల సమ్మేళనము వైభవముగా జరిగినది. రెండురోజులును ౬౹౹ గంటలు మొదలుకొని ౮ గంటలవరకు జనులు సభయందు నిండియుండిరి. స్త్రీలును చాలమందివచ్చిరి.

మొదటిరోజు అనగా శుక్రవారమునాడు సాయంకాలము సరిగా ౬౹౹ గంటలకు సభ ప్రారంభమయ్యెను. ప్రార్థనానంతరము శ్రీయుత నందగిరి వెంకటరావుగారు అధ్యక్షపీఠము స్వీకరించిరి. అధ్యక్షులవారు విపులముగా వ్రాసికొనివచ్చిన తమ ఉపన్యాసములో చిన్నకథలపుట్టుక, ఆంధ్రవాఙ్మయములో వాటిస్థానము వర్ణించి, నేడు తెలుగుపత్రికలలో ప్రకటించబడుచున్న అనేకకథలు మంచివిగాలేవు అని ఇటీవలలేచిన ఆందోళనను గూర్చి చెప్పిరి. కథ సరిగా మంచిదిగా నుండుటకు కొన్ని సూచనలను చేసి, ఉదాహరణములతో చక్కగా బోధించిరి. పత్రికా సంపాదకులుకూడ కథలనుసానుభూతితో చూచుచుండవలెనని చెప్పిరి. హైదరాబాదులోను కొందరు మంచికథకులు గలరనుచు శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, వెల్దుర్తి మాణిక్యరావు, భాస్కరభట్ల కృష్ణారావుగారలను, శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి గారిని పేర్కొనిరి. ఈదశ ఇట్టికథకుల సమ్మేళనములు ప్రతిసంవత్సరము ఇదేరీతి జరుగుచుండినచో హైదరాబాదులోకథకులకును ప్రోత్సాహము కలుగునని ముగించిరి.

పిమ్మట కంభంపాటి సత్యనారాయణగారు వ్రాసిన చిన్నకథ చదువబడెను. అటుతర్వాత శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారిగారు వ్రాసిన "పునిస్త్రీ పునర్వివాహ" మను కథ చదువబడెను. ఈరెండుకథలలోను ఒక స్త్రీ మొదటిభర్త పెట్టుబాధలు పడలేక రెండవవివాహమునకు యత్నించుటయను వస్తువు భిన్నరీతుల వర్ణించబడినది.

అటుపిమ్మట తుమ్మలపల్లి సీతారామమూర్తిగారు చిన్నికథను సరిగా నిర్వహించుటకు కొన్ని నియమములను వర్ణించిరి. కథయొక్క ఆది మధ్యావసానము లెట్లుండవలెనో మొదట మనస్సులో సరిగా అల్లుకొని తర్వాత కథను కాగితముపై వ్రాయుటకు ఉపక్రమించవలెననియు, కథలో ఆవేశము అనునది ఉండవలెననియు, ఆ ఆవేశము వస్తువునట్టియే గాక కథయొక్క చాతుర్యమునుబట్టియు ఉండవచ్చుననియు చెప్పిరి. చిన్నకథలలో ఉపయోగింపదగిన భాష ఎట్లుండవలెనో చెప్పుచు, వర్తమానకాలమునకేగాక భావికాలమునకూడ నిలిచి నిఘంటువుకెక్కదగినభాషనే వాడవలెనుగాని ఇష్టము వచ్చినట్టి వ్యావహారికభాష నెల్ల వాడరాదనిరి. నేడు కొందరు ఉత్తరసర్కారు వ్యావహారిక భాషనుమాత్రమే వాడుచున్నారు. ఇట్లే తక్కిన ప్రాంతీయులును తమతమ ప్రాంతములభాషను వాడుచో ఒక ప్రాంతపుభాష ఒక ప్రాంతమువారికి తెలియకపోవచ్చుననియు ఒక కాలములో వ్యావహారికభాష ఇంకొక కాలమువారలకు తెలియకపోవచ్చుననియు అట్లుగాక అన్ని ప్రాంతముల వారికిని భవిష్యత్కాలమునకూడ అర్థము అగురీతిని వ్రాసిన మంచిదనియు ఉపన్యాసకుడు చెప్పెను. ఈసూత్రము ననుసరించి నిజాంరాష్ట్ర ప్రాంతములలో నిఘంటువున కెక్కదను ఇక్కడి వ్యవహారపదములేవో శ్రీయుత మాడపాటి హనుమంతరావుగారును గోలకొండపత్రిక సంపాదకులును మున్నగు ఆంధ్రనాయకులు చేరి నిర్ణయించి, ఇపుడు జయంతిరామయ్య పంతులుగారు సమగ్ర ఆంధ్ర నిఘంటు సంపాదనకై చేయుచున్న కృషికి తోడ్పడిన ఆంధ్రభాషకెంతో అమూల్యమగు సేవచేసినవారలగుదురని చెప్పిరి. ఈకాలము అనేకకథలకు అసభ్యమగు శృంగారముతప్ప ఇంకొకరసము తోచుటలేదనియు, కరుణరసము, వీరరసము ఇత్యాదులు మనదేశపు ప్రస్తుతపరిస్థితులకెంతయో అనుగుణములనియు, కావున కథకులిక మీద ఈమార్గములనుగూడ త్రొక్కవలెననియు చెప్పిరి.

వీరిఉపన్యాసముతో ౮౹గంటలు కావచ్చుటచే అధ్యక్షులవారు నాటికి అంతటితో సమ్మేళనము చాలించిరి.

× × ×

మరునాడు సమావేశము కొంత అలస్యముగా (సుమారు ౬౹౹ గం.లకు) ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను.

మొదట తిరుమలరావుగారు వ్రాసినకథ చదువబడెను. పిమ్మట సురవరము ...... గారును, భాస్కరభట్ల కృష్ణా ...... తమతమకథలను చదివిరి.

అంతట నైజాం కాలేజిలో ...... చార్యులగు శ్రీయుత కురుగంటి ...... య్యగారు చిన్నకథనుగురించి ఉపన్యా ...... వారి ఉపన్యాస సారాంశమిది:—

చిన్నకథ ఈశతాబ్దిలో గడచిన ౨౫ లేక ౩౦ ఏండ్లనుండి మన తెలుగులో ఎక్కువప్రచారమునకు వచ్చినది. అది భావకవిత్వమునకు ఒకశాఖగా వచ్చినది. చిన్నకథాకార్యము కావ్యము కాదా! కావ్యమునకుదానికి మన ప్రాచీనులు "అదోషౌ గుణోపేతౌ శబ్దార్థౌ కావ్యం" అనిరి. వారికంటె అధునికులగు రసగంగాధరకారప్రభృతులు రమణీయార్థ ప్రతిపాదకం కావ్యం అనిరి. ప్రతిపాదింపబడు అర్థము రమణీయముగ నుండవలెనని దోషములులేక మంచి గుణములు అలంకారములు శబ్దార్థములలో నుండవలెను కావుననే పై మొత్తముమీద రెండులక్షణములును వికారములే. కావ్యము పద్యాత్మకమేగాక గద్యాత్మకముగ నుండవచ్చును గనుకను, చిన్నకథ గద్యాత్మకమై ఏదేనియొక అర్థమును రమణీయముగ ప్రతిపాదించునదికనుక చిన్నకథ కావ్యమే. చిన్నకథ నవలనుండి పుట్టినది నవలకు ఆంగ్లసాహిత్యములో నొక నిర్ణీతస్థానమున్నది చిన్నకథయందును నవలకు రెండు లక్షణములున్నవి గనుక చిన్నకథయు కావ్యమే.

చిన్నకథ ఉపయోగించుభాష ఎట్టిదిగ నుండవలెను? చిన్నకథ పాశ్చాత్య నాగరికతలో తీరికసమయములు కొద్దిగానుండుటచేతను తీరికయున్నవారలు సైతము తీరికలేని వారలవలెనే ఏదో కల్పించుకొని పోవుచుండుటచేతను కొద్దిగానుండు తీరికవేళల ఆనందమిచ్చుటకు పుట్టినది. ఇది సమస్తబాలవృద్ధ స్త్రీపురుషులందరు చదివి ఆనందించదగినది. కావుననిన్న

కథకు వ్యావహారిక భాషయే వాడదగినది. ఇప్పటి భారతిలో వచ్చుకథలు గ్రాంథిక భాషతో నుండెడివి. కాని ఇప్పుడిప్పుడు స్త్రీపురుషుల సహజ చిత్తవృత్తులను అద్దమువలె ప్రతిబింబింపజేయు వ్యావహారిక భాషయే వాడబడుచున్నది. కథ వ్రాయుటలోగదా! అది మనుష్యస్వభావములను సరిగా పొందికగా చిత్రింపవలెను. తక్కిన కావ్యము లన్నిటికివలెనే చిన్నకథకును ఆనందమే లక్ష్యమని నేటి ఆంగ్లేయ లాక్షణికులవలెనే ప్రాచీన లాక్షణికులును అంగీకరించియున్నను, ఆనందముతోపాటు ఏదోయొక సదుద్దేశ్యముగల కావ్యము ఎక్కువ ప్రశస్తము గదా! మనపూర్వులే "కాంతాసమ్మిత తయోపదేశయుజే" అను ప్రయోజనమును కావ్యమునకు చెప్పియున్నారు. ఈలక్షణము తక్కిన కావ్యజాలములకంటె చిన్నకథలకు ఎక్కువ వర్తించుచున్నది. చిన్నకథలు భార్యలవలె హితోపదేశము చేయగలవి. అట్టి హితోపదేశము చేయుకథలను వ్రాయవలెనేగాని అసభ్యమైన ప్రేమకథలను మాత్రమే వ్రాయుట మంచిదిగాదు. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు అట్టి ఉత్తమకథకులలో నొకరు. భారతిలో ఇటీవలపడిన "లంఘనం పరమౌషధం" అనుకథయు మంచి ఉదాహరణము."

తర్వాత తిరుమల కృష్ణశర్మగారికథను భాగయ్యగారు చదివినతర్వాత మచిలీపట్టణమునుండి ప్రత్యేకముగ సమ్మేళనమునకై వచ్చిన రాఘాకృష్ణకవిగారు ఇంకను మూడేనిమషాలు, ఇంక ఒకటేనిమషమని వ్యవధి హెచ్చింపగోరుచు మహోద్రేకముతో ఉపన్యసించిరి వారు ప్రత్యేకముగ ఈసమ్మేళనమునకై వ్రాసిన ఒకఉపన్యాసమునుండి భాగములను చదివి వినిపించిరి. ఇట్లు వారుచెప్పిన విషయములలో ననేకములు కురుగంటి సీతారామయ్యగారు చెప్పినవే! వారు నేటికాలమున మంచికథలు నూటికి ఒకటో రెండో నని చెప్పుచు దీనికి కారణము రాజపోషణలోపమనియు, అట్టిలోపముచే పొట్టకూటి సంపాదనయే ప్రధానప్రయత్నమై నిజమైన కళోపాసనకు భంగము కల్గించుటయనియు చెప్పిరి. ఈకాలములో నూటికి ౯౯ పాళ్లు కథలు అసభ్య శృంగార వర్ణనచే జీవించుచు, అందు ఆంధ్రపాత్రలనిరికించి ఆంధ్రులకు చాల అపఖ్యాతి కలిగించుచున్నననియు ఇది తొలగవలెననియు మహోద్రేకము ఉచ్చైస్స్వరమున ఘోషించుచు వర్ణించిరి. ఉపన్యాసము ముగించుచు ఇట్టి సమ్మేళనములచే లాభము లేదనియు, ముందు చిన్నకథలను ఏవిధముగ వ్రాయదగునో అట్టి మంచిమార్గములను ఆలోచించుకొని చిన్నకథలు అసభ్యములుగాక సంఘమునకును దేశమునకును ఉపకారులగునట్లు చేయుటకు యత్నించదగుననియు సూచించి ముగించిరి.

పిమ్మట ఖండవల్లి లక్ష్మీరంజనంగారు కరుణరసమును ప్రధానముగ పెట్టుకొని ఫ్యాక్టరీ కూలిజీవితమును వర్ణించుకథను చదివిరి. [illegible] రావుగారు తమకథను చదివినపిమ్మట అధ్యక్షులవారు సమ్మేళనకార్యమును ఉపసంహరించుచు, అప్పటికి కాలాతీతమగుటచే చదువదగిన కథలెన్నియో చదువవీలులేక ఆపబడవలసివచ్చెననియు. ఈ సమ్మేళనము వలన హైదరాబాదులో ఎంతమంది కథలు వ్రాయగలవారలు ఉన్నారో తెలిసినదనియు, వీరందరును మంచి కథకులుగ వృద్ధికి రాగలవారలనియు చెప్పి, సమ్మేళన సమావేశకులకును, సభికులకును కృతజ్ఞతానందనము లర్పించిరి. అటుపిమ్మట కృష్ణదేవరాయాంధ్రభాషానిలయ కార్యదర్శిగారి కృతజ్ఞతా వందనములతో సభముగిసెను.

ఈ సమ్మేళనమునకై నిలయము తోరణములతోను పూలతోను అలంకరించబడినది. నేలపై తివాసీలుపరచి వాటిపై తెల్లనివస్త్రములు పరువబడి, ప్రాచీన భారతీయ మహారాజుల ఆస్థానము జ్ఞప్తికి వచ్చుచుండెను.

## షర్ఖి జునూబితాలూకాలు

అత్రాఫుబల్దా జిల్లాలో చేరిన షర్ఖి, మహేశ్వరము, మరియు జునూబితాలూకా గ్రామములలో, పర్భణాను గ్రామాలలో సుమారు రెండు మాసములనుండి బొత్తుగా వర్షములు లేకుండుటచే పంటలు ఎండిపోవుచున్నవి. రైతులదురవస్థ వర్ణనాతీతము. పశువులకు మేతలభించుట దుర్లభమగుటచే కృశించిపోయినవి. ఇంతనే బావులక్రింద పొలములకు నీరుపెట్టచేయుటలో పశువులు శక్తిలేనివైపోయినవి. రైతులు పస్తుండవలసివచ్చుచున్నది. పశువుల పోషించుట అసాధ్యముగామారినది. ఇట్టి పరిస్థితులలో బాధపడుచుండు రైతులకు సర్కారుశిస్తు జ్ఞప్తికి రాగానే సింహస్వప్నముగాయున్నది. యీటీవ రైతులవిషయము పొలనాధికారులు శ్రద్ధవహించుట ముఖ్యావసరము. (రయ్యతు)

## కథియవారుసంస్థానంలో గాంధిటోపి నిషేధము

తమ సంస్థానములో ఎవరును గాని గాంధిటోపీలు కట్టరాదని నిషేధించి, ఇందుకొపుదలగా టోపీవ్యాపారములనుండి కథియవారుసంస్థానమువారు ధరావతుతీసుకొన్నటుల తెలియుచున్నది.

### క్వెట్టా నిర్మాణము

క్వెట్టా భూకంపమువలన పడిపోయిన ఇండ్లను యింకొతిరిగి బాగుచేయుచున్నారు. శవములు లభించుచున్నవి. నూతనముగా దుకాణములు కట్టుకొనుచున్నారు. ఇంతవరకులభించిన సొమ్ము రు ౫,౦౦,౦౦౦ లు అంచనావేయబడినది. పైసొమ్మును ఎవరిదివారికి అందచేసినారు.

